# చిలుకరాయబారము

మదరాసు, 1926

Record no. 232

## Bibliographic Record Target

చిలుకరాయబారము / మదరాసు : వేలూరు కుప్పుస్వామి మొదలారి, 1926.

15 p. ;12 cm.

Record no. 232

Cilukarāyabāramu / Madarāsu : Vēlūru Kuppusvāmi Modalāri, 1926.

15 p. ;12 cm.

Record no. 232

శ్రీ రస్తు

శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

# చిలుకరాయబారము.

ఇది,

కుప్పుస్వామి మొదలారివారి
స్వకీయ
ందు ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.
చెన్నపురి.
1926

0.1.0.

శ్రీరస్తు.

# చిలుకరాయబారము.




ఇది

వేలూరు - కుప్పుస్వామి మొదలారివారి

అమెరికన్ డైమెన్డు ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రచురింపఁబడినది.

మదరాసు.

1926.

శ్రీరామజయము.

# చిలుకరాయబారము.

---

ప్రాణాపదంబైన పంచావన్నెలచిలుకరావే। నా విభునితోడి తేవే తన్నాడినట్టి మాటలన్ని మొన్నవింటివా। మేనమామకొడుకు కీర్తిగా తనూ పంతమాడేనూ। తన్నే గాని పెండ్లి ఆడననుచూ పట్టుపట్టెనే। విప్రుణ్ణి బంపితికబురు తెలియదాయె చిలుకరో ఏవిధమ్మునననైన తనవిభుని తోడి తేవే। భీష్మకకొమారుడు పంతముతో పట్టుపట్టెనే। శిశుపాలునికిచ్చి పెండ్లిచేతూననుచుబలికెనే తా పెద్దకొడుకాని యెదురూగ తానిలిచి పలికేను। తాబట్టినాకుందేటికి మూడే కాళ్ళనునూ । కమలనాభుని పొందుయెన్నాడు। కన్నులగందూనూ। కరుణాకటాక్షూలూయెన్నాడుతన్నా మోహించునో । పరమదయాళూడువచ్చి తనయెదుటా నిలచునా। కరుణాతో నన్ను పెండ్లాడునా। గారావించునా। గౌరీదేవిని తానుపూజించి నగరికి రాగాను। కనకరత్నము

బెట్టేకు చిలుకారో। చల్లన్ని నాప్రాణ నాథుణ్ణి పొడగంటి
వా। అందెలుగట్టేను మువ్వాలుగట్టేను చిలుకారో। ఆసం
దకృష్ణమ్మ ముచ్చాటలన్ని వింటివా । గంధాము బూసేను
పువ్వ్వాలుముడచేను చిలుకరో పుండరీకాక్షునాలు యేవం
కవచ్చేరో జెప్పావే। అక్కారో జూడుమని। నే జెప్పి గోపుర
మెక్కితీ। దిక్కూలుదీవ్వూలు నాలుగురాజ్యాలుజూచితీ।
దక్షిణభూమీ తప్పాకతలయెత్తిజూచితి । ద్వారాకపుర
మూలో కనకగోపురాలకు మొక్కితీ। అభిషేకపూజాలు
జేసేటివారినిజూచితీసవ్వుచువచ్చేటి నల్లబిళ్ళలవార్ని జూచీ
తి। బారూగవచ్చేటి పచ్చబిళ్ళలవార్ని జూచీతి బలరాముడు
మొదలయిన ఘనమైనదొరలానుజూచితీ। ఆవెనుకవచ్చేటి
ద్వారపాలకులాను జూచీతి। యీ వెనుకవచ్చేటి విప్రాలకు
లాను జూచీతీ। శృంగారవనమూలు శ్రీకృష్ణుడూ పొగడా
జూచీతి। వేగా మెగోపూరముదిగి అక్కరోవచ్చితీ। వసుదేవ
నందనుడవచ్చిరమణీని చేకొనెను। చేరూవలగ్గా మురమ్మాని
కృష్ణునితో జెప్పితి। రూపించి నీవిభునిరూపమంతా నేను
జెప్పేను। అలియూక సొలియూక భక్తితో గూర్చుండీ వి



నావె । అందామైనా మంచి నీలావర్ణుని శిఖాపై పొందూ
గాజుట్టేను పారిజాతాపూలబంతూలూ । మంచీకిరీటాము
మకరకుండాలములు బెట్టెను। వెలలేని వజ్రాలపోగూలు
బెట్టేను వెన్నూడు । బావీలిముత్యాల నీలాలపోగులూ
నీటుగా । కట్టెనుపీతాంబ్రము వల్లేవాటుగాకృష్ణుంబూ। అ
ద్దంపుచెక్కిళ్ళు ముద్దూలుగారను అక్కారో। కలువారే
కులవంటి కన్నులాతీరేలఅక్కారో। మన్మథునిచేతి సింగిణి
విల్లైకనుబొమ్మలూ। పంచారత్నమువంటి బాతూలతీరే
కులువరుసాలరటిబోదెలవంటి। చక్కానితొడలేలక్కారో।
చెఱుకూకొనలవంటి చక్కానిచేతూలె అక్కారో। యెగు
భుజమ్ములతీరు యెంత వింతలగాదెఅక్కారో। ఘుమఘుమ
మమని యేటి కుంకుమాపరిమళములలదిరి । సందిటిదండా
లు జతలాతావే జూలూమెరయాగా। పచ్చాలకడియాలు
ముంజార । ముత్యాలాముఱుగూలు । చిత్తాజుతండ్రికి ము
త్యాలకంఠమాలందామూ । ఘుంటలమొలత్రాడు జమి
లీగంటలుమోల మ్రోయగా । చందామామాతోను
సరసాములాడూచు కదిలేను । ఈడూగాపాడూను ఇరు

వంక చామారాలెయ్యాగా। ఆకులూపోకలు అతివాలు
మడిచియియ్యాగా। మణులందికొలువుల్లో చిన్నారినవ్వులు
నవ్వుతూ। వాసావాదులకైన వర్ణించిపొగడావశమటే।హ
రివాసుదేవుడే యెవ్వారో గానీ తెలియాదు నాకన్నా
లకుజూడ। వెన్నెలవాడేనున్నాడూ। రూపించినీవిభునిరూ
పమెంచానూతరమాటే చిలుకాపలుకాగ। రుక్మిణితన
మాదిమరచేను।కన్నులుమూయుచు మెల్లగామూర్ఛాలు
బొందెను రుక్మిణినీజూచి।చిలుకాకిలకిలానవ్వేను। అక్కా
లోయిటువంటి మాటాలాకెవరైనా భ్రమసేరా। చెలి
కత్తెలందరూ। గుంపూలుకూడుక నవ్వారా। కన్నవిన్నా
వారందారూ కేకలువెయ్యారా। ననుగన్నతల్లి యిదినీకు
బుద్ధిగాదమ్మరో। చిలుకారో యేమాని జెప్పూవు యిక
నేతాళాను। శ్రీకృష్ణరాయలుకోటవాకిలి దాటివచ్చేరా।
రుక్మాంగునినగరిలో। విడుదూలునిలుతూరా। పప్పూబ్రా
లూ ఒప్పూగాకూరాలు వేతూరు। తెప్పాలుగా నావిభు
నికి పుష్పాలూదెత్తూరా। అంతాటగోపాలకృష్ణమ్మ వాకి
టనిలిచేను।కళ్యాణివగవాకు నీప్రాణనాథూడువచ్చేను।ప్ర



తమూలుతపమూలు। పణతిరోనీకూ చేకూడేను। వారిజ
నాభూలు। వనితరోనీసొమ్ములాయేను। కలకంఠూమునీగుణ
మూలు మెల్లగామెచ్చూను। సీతాంగనవాడూ। అశోకా
వృక్షామూక్రిందాను। చింతింపుచుండాగ హనుమంతురా
యూలువచ్చిరి। ఆనావాలూ తెచ్చిఅతివాశోకముదానూ
మాన్పేను। ఆలాగేతనవిభుని తెచ్చి తనప్రాణాలుయిస్తీవి
చిలుకారమ్మానీ। అక్కూనాముక్కూనా చేర్చేను। చిలు
కారమ్మానిభమిడీ పంజరములోనుంచేను। చెఱుకూలుపల
మూలు తెచ్చిచిలుకాకిచ్చేను। భీష్మామహారాజు అంతః
పురమ్ములోకొచ్చేను। పేరంటాళ్ళలారకన్యాకుశృంగారిం
చూడీ। సంపెంగతైలాన సొంపూతోశిరసు అంటిరి।గంధా
ము అటకాలిబెట్టి జలకాములార్చిరి। సోగాకన్నులమంచి
తిరుగాకాటూకాదిర్చిరి తీరూగాకస్తూరితిలకామునుపటా
దీర్చిరీ।ఘుమఘూమామని యేటి కుంకుమాపరిమళములల
దిరీ। పసిడిపువ్వులచీర మొలకబోసి వేగ గట్టిరీ। చిత్తాజు
తల్లికి ముత్యాలరవికా తొడగిరీ। ముత్యాలముడిమీద
రత్నాలరవ్వాదాపిరి। ఎక్కువైనామంచి యేడువారపు

సొమ్ములుంచిరి। శృంగారించూకురుక్మిణినిదోడూకుకదలీరి॥ గౌరిదేవిపూజ ఘనమూగశాయరుక్మిణీ। శ్రీకృష్ణమూర్తిని దలచూచు । పార్వతికి మ్రొక్కూచు । దేశాధిరాజూలు చూడాగకో వెలకు వెళ్ళేను । గౌరిదేవిని దెచ్చికనకంపుగద్దె పైనుంచిరి। అతిభక్తితోకూడ దేవినిపూజింపదొణగేను॥

పద్యము.

రుక్మిణీదేవి గౌరిదేవమ్మను ప్రార్థించుట.

ఉ॥ నమ్మితి నామనంబున సనాతనులైన యుమా
మహేశులన్ । మిమ్ముబురాణదంపతుల మేలుభజింతుగద
మ్మ మేటిపెద్దమ్మ దయాంబురాశివిగదమ్మ హరింబతి సీ
యుమమ్మ నిన్ ।నమ్మినవారికెన్నటికి నాశము లేదుగదమ్మ
యీశ్వరీ॥

ఆకూలుపోకాలు రుక్మిణీదోసిటబోసిరి। మల్లెలమొల్లాలరుక్మిణీదేవిని పూజించేను । భక్తిసాష్టాంగదండాము గౌరికిబెట్టెను । తిరిగివచ్చెను వేగరాజూలా నందరిన్ని జూచూచూ। శ్రీకృష్ణరాయలు। కానరాకపోయె చిలుకా



గో। ఈక్షణముదప్పితె శిశుపాలునిపాలుఅవుదూనే। అని రుక్మిణీతానుచింతించి నడచుచురాగాను। దేశాధిరాజులు జూచిమూర్ఛలు జెందిరి । పొంగూచునుశిశూపాలూడుదప్పూవలవిలిచేను । దేశాధిరాజులకు వర్ణించ తరముగా కాను। భీష్మమహారాజురుక్మాంగుడూజూచుచుండగా । శ్రీకృష్ణరాయలు యేతెంచి దేవినితీసూక । బంగారురథముపై । రుక్మిణినియుంచూక। కదలేను । రథముజూచీశిశుపాలూడు తనతాలవంచేను । శంఖాము పూరించిశ్రీకృష్ణరాయాలుకదలీరి। వెనుకాముం దారపది వేలరాజులురాగాను। అంచలంచాల అడుగూలుబెట్టూచు నడచూచూ। రాజుల నామములుగూర్చి రుక్మిణితో జెప్పూచు। కంచురథమూయెక్కి కాంతారోమియన్నవచ్చేనే। వాడిమీసముసేను గౌరిగిపంపింతూను జూడుమీ। వెండిరథమూయెక్కిశిశుపాలుడూ వచ్చెజూడుమీ। దేశాధిరాజులు చూడాగాపీడి తలలువంతూనూ। దశదిశలరాజులుగెలవలేకా వారుసిలిచీరీ। అర్ధాముగొరుగాగ రుక్మాంగుడూ తానునఅడలేనూ।

బలరాముడూవచ్చి సేనలందరపారదోలెనూ । సభరాజు లాజూచి శిశుపాలుడూతానుబలికేను॥

కీర్తన.

ఏమయ్యసఖులారమిమునమ్మి జవరాలిగోలుపోతి నాభామనీదెచ్చినాకియ్యకున్నానుప్రాణములునిలువలేను సతినియోడీ ప్రాణధారణముకేంలెనుభూమిపైబ్రాలుటా మేలూ। నాసతినియెత్తుకొనిపోవుచున్నాడువీడెంతసాహం తుడోదైవమా। చుట్టుకునిమీరుండగొల్లవాడెచటుండివ చ్చియెత్తుకపాయెనో । మితిలేని గోపకాంతలు యుండగా తానుక్రొవ్వెనేగోపాలుడూ । కలకాలంబూనియొకపండు పండితె చిలుకావిధంబాయెను । ఏమయ్యసఖులారమిము నమ్మి జవరాలిగోలుపోతి.

అనిశిశుపాలూడు దుఃఖంచుతూతానుమళ్ళైను।అ ప్సరసలాడాగపుష్పాలవానాగురిసేను। ద్వారాకపురమం దునగరివాకిటానిలిచీరి । యెదురుగాసేసాలుజల్లిరిహారతు



లుయిచ్చిరీ । రుక్మిణిదేవినిఅంతఃపురమ్ములో నుంచిరి । ది క్కులవారిని దేవూనిపెండ్లికిమ్మనియెల్లుండిలగ్నామనుర మ్మని శుభలేఖవ్రాసిరి । కరకంఠుడపార్వాడు గౌరితో గూడివచ్చేను । పద్మాసంభవుడు శారదతో గూడీ వచ్చే ను । చెలికత్తెలందారువీణేలు పుస్తూకంబూలూ । కొల్లా లుగాబళ్ళధనమూలు । బట్టూకవచ్చిరి । చక్కాగద్వారా క పురమంతరాజులునిండిరి । భీష్మాకమహారాజు తనసతి తో గూడివచ్చేను । అంతఃపురమ్ములో కాంతాలందా రు గూడూక । సంపెంగితైలాన సొంపుతో శిరస్సులం టిరి । గంధాము అట కాలిపన్నీట జలకాములార్చిరి।కురు లూచిక్కులుదీసిపువ్వూలు మల్లెలుముడిచిరి। సోగాకన్ను లమంచి తీరైనకాటూకా దీర్చిరి। తీరైనా కస్తూరితిలకా ము నుదటాదీర్చిరి । పట్టుపీతాంబరము మొలకువేసి వేగ గట్టీరి । వైభోగచేడియూకు వైడూర్యపు రవికాదొడిగీరి ముత్యాలముడిమీద రత్నాల రవ్వాలుదాపీరి । ఎక్కూ। వైనయేడువారాలసొమ్మూలనుంచిరి ఘుమఘుమునియే

టి కుంకూమ పరిమళములలదీరి। గౌరి దేవిని దెచ్చికనకంపు గద్దెపైనుంచిరి। ఆకూలురుక్మిణీదోసిటబోసిరి। మల్లెలు మొగ్గాలురుక్మిణిపూజింపుచుండేను। నాడుఅచ్యుతుణ్ని విభుని గానేనుగోంత। కొడుకూలకూతుల్ల విమ్మాని గౌరికిమ్రొక్కెను। విప్రునిబంపీ మాకృష్ణునిచేరాగోంటీవి। అనివారుబలుకాగ నవ్వుచు తాలావంచేను। భీష్మాకమహారాజుఅంతఃపురములోకివచ్చేను। కన్యానుదోడుకరమ్మని వారితోజెప్పేను। సజ్జాగ్రాలూబోసికన్యాను గంపాలోనుంచిరి।భీష్మాకమహారాజు తనసారగూడినిలిచేను। శ్రీకృష్ణమూర్తికి కాళ్లుగడగీధారపోసేను। రుక్మిణిదేవిని ప్రీతిగసామూర్పించెను। అప్సరసలాడాగ దుందుభులు మ్రోయగకృష్ణూడూ। రుక్మిణీదేవినికళ్యాణమాడేను। ఘనముగా వచ్చినవారికి వరుసాతోకట్నాలిచ్చిరి। సఖులానుగూడుకసంతోషమునవారువెళ్ళిరి। సిగ్గుబడి శిశుపాలుడు తనతాలవంచెను। వెరువాకు మనిచెప్పి ఘట్టిగతని చట్టబట్టేను। రుక్మాంగుడీపంతాములన్ని వడిగాసాక్కేను। గుంపూలు



గూడుకపేరంటాండూ9సొంపూతో। పాడుతువచ్చిరోకళ్ళు చేతాబట్టూకూ। పంకజనాభూలమీదా సుంకూలు జెరిగిరి। అచ్చాటనాగవల్లి యమరాజేసిరి। నాగవల్లికుత్తిగంటూమెడగట్టిరి।తల్లికి దండ్రికి రుక్మిణిదేవి మ్రొక్కేను। కన్నీరుదెచ్చుకుని కౌగిలించి వారు చిలికిరి। కన్నతల్లివినీవువగవాగ నేటీకినమ్మారో। మేముధన్యులమైతిమీ కృష్ణుడల్లూడు కాగాను। కన్నతల్లికిమ్రొక్కి కన్నీరుదెమ్మాకనగచేను। కన్నతల్లివినీవువగవాకే ధన్యులమైతీమీ। అనిచెప్పికన్యాకుతమరుతెనుపట్నముకు వెళ్ళిరి। రుక్మిణినిగూడూక సంతోషమూనయుండిరి యీపాట యెవరైన పాడిన విన్నాను కృష్ణూలు। అష్టయిశ్వర్యములు యిష్టసంపదలు యిచ్చూను। కన్యకలు యీపాటపాడినా విన్నావానికి। కల్యాణమానని రుక్మిణి తాను బలికెను॥

చిలుకరాయబారము

సంపూర్ణము.

---

అమెరికన్ డైమెండు ముద్రాక్షరశాల, చెన్నపురి.

# వేదాంత గ్రంథములు.

| | |
|---|---|
| హఠయోగప్రదీపిక వేదాంతవేద్యము ఇందు 128 యోగాసన తద్రూప పటములు గలది | 2-8-0 |
| యోగవిద్య ఇందు 32 యోగాసనరూపపటములు గలది | 0-4-0 |
| శ్రీ సీతారామహృదయం బను, పదునారురాజుల కథలు | 0-12-0 |
| శ్రీ కృష్ణామృతబోధయను పన్నెండు రాజుల కథలు | 0-12-0 |
| సచ్చిదానంద బోధామృత మను రాజహంస పరమహంస సంవాదము | 0-12-0 |
| దృగ్దృశ్య వివేకము | 0-10-0 |
| వేదాంతసార ప్రశ్నోత్తరరత్నావళియను గురుశిష్యసంవాదము | 1-0-0 |
| పరమాత్మలక్షణబోధిని (పద్యకావ్యము, టీకాతాత్పర్యము | 0-8-0 |
| శుకబ్రహ్మకైవల్యము అను శ్రీ శుకమహర్షి చరిత్రము | 0-12-0 |
| బ్రహ్మజ్ఞానచింతామణియను, సుగుణాకరమహారాజు కథ | 0-8-0 |
| ఉపనిషత్సార రత్నావళి యను శ్రీరామచంద్ర హనుమంత సంవాదము | 0-8-0 |
| బ్రహ్మవిద్యా రహస్యము వచనకావ్యము | 0-2-0 |
| వేదాంతరహస్యదర్పణమను జ్ఞానసుందరి వివేకసుందరికిం జెప్పిన నూతన విచిత్ర పతివ్రతల కథలు | 0-10-0 |
| పాతంజల యోగశాస్త్రము తాత్పర్యము గలది | 1-0-0 |
| సస్వరూపప్రకాశిక పద్యము తాత్పర్యము | 0-4-0 |
| పౌరుషపారమ్యమను పురుషార్థదీపిక ఆంధ్రతాత్పర్యము | 0-2-0 |
| సనారి విశ్వేశ్వరసంవాదము పద్యము తాత్పర్యము | 1-0-0 |

వెస్టువార్డు అండు కంపెని, చాకలపేట, మదరాసు.

